# పీఠిక

ఆర్యులారా!

యీచిన్నపొత్తంబున శ్రీయష్మాకక్షేత్ర మహాత్మ్యమంతయు సంక్షిప్తంబుగ వ్రాసినాడను. ఇంతటి గాథ జగద్విదితమగు నదియే కాని ప్రమాణంబగు నేగ్రంథముఁగాంచి వ్రాయఁబడినదికాదు. కాన నిందేమిపొరపాటులున్నను నన్ను క్షమింపఁగ నందులకుఁ బ్రార్థించుచున్నాడను.

నాయందుగల శిష్యవాత్సల్యముంచియీగ్రంథమును సాంతముగాఁ బరిశీలించి నాసందేహములఁ బాపిన శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవిబాలకలానిధి బాలసరస్వతీ శతావధానులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీంద్రుల కనేకవందనంబులాచరించుచున్నాను.

ఈగ్రంథరచనకు, నాకత్యంత సహాయంబుఁ గావించి నన్నుఁగృతార్థుఁజేసిన శ్రీమాన్ శ్రీసకలగుణసంపన్నులయిన గొట్టుముక్కల లక్ష్మీనృసింహాచార్యులవారలకును, మ॥ రా॥ శ్రీ పుట్టాగంగరాజుదొరవారికిని నాకృతజ్ఞతాంజలులు.

కాకినాడ
1-3-17

ఇట్లు విద్వజ్జన విధేయుఁడు,
గండికోట బాబూరావు.



ఓం

శ్రీ వేంకటేశ్వరాయనమః

# శ్రీయుష్మాకక్షేత్రమహాత్మ్యము.

శా. శ్రీయుష్మాకపురంబనన్ బరఁగుసు
క్షేత్రంబునన్ దాపసుల్
శ్రేయంబౌ భజనాళిసల్ప దివిజుల్
సేవింపఁజెన్నారనల్
చాయల్ దుందుభులెల్ల వేడ్కమొఱయన్
జానొప్ప సద్భక్తిపో
పాయత్తుంబగు వేంకటేశ్వరునినే
ప్రార్థింతునెల్లప్పుడున్.

తా. మునీంద్రులు భజనలుసేయఁగా దేవతలు గొల్వఁగా నాల్గుపక్కల భేరీమృదంగాది నాదంబులు మ్రోయఁగా శ్రీయుష్మాక యనఁబడు నుక్షేత్రంబున నొప్పు వేంకటేశ్వరు నెల్లప్పుడు

నేను ప్రార్థించెదను.

చ. వరశుగునాల్గు వేదముల
 • వంచన చేదన చెంత నుండిన
ద్వారముగ దొంగిలించి కడుఁ
 • బాపముఁ గొంకుఁ గట్టుకొన్న యా
పరుషుని రాక్షసాధముని
 • బాపినిఁ గోపినిఁ గూళ సోమకా
సురునెట్టులైనఁ గూల్ప మధు
 • సూదను వేడన జొంపుభక్తిమై.

తా. బ్రహ్మదేవుని నాల్గు వేదములను దొంగి
లించుకొని పోయిన సోమకాసురునిఁ జంపుటకు
విష్ణుమూర్తిని బ్రహ్మ వేడుకొనెను.

ఉ. వైదిక మార్గముల్ నిలుపు
 • వాఁడవు భక్తపోషకుఁడవే
దీ! దయఁ జూపవే! పరమ
 • దీనుఁడనా మొఱ నాలకించుదా
సోదర! దీనపోషణ! మ
 • హోన్నత సద్గుణ! నన్నుగాచినీ
వేదరిఁ జేర్చువాఁడవని
 • యెంచితినిన్ను భజించితిన్ హరీ!

తా. శ్రీహరీ ! నీవుభక్తులరక్షించు వాఁడవని యు దీనులను బోషించువాఁడవనియు [illegible] గొల్చుచున్నాను. కావున నన్నుఁగాపాడుము.

సీ. ఎండచేఁగడుడస్సి • పండియుండిన
వానికమృతసరోవరం • బాదినట్లు
చలిచేతవడఁకియు • చ్ఛ్వాసలూడిన
వానికరుణకిరణుకర • మందినట్టు
లప్పులలోమున్గి • యలసెడువానికిఁ
జిరుకైనయొకతెప్ప • దొరకినట్టు
లాలుబిడ్డలపోష • ణార్థమర్థవిహీను
చేతనిధానముల్ • చిక్కినట్టు
గీ. లాపదలుసంభవించిన • యట్టివాని
కబ్జనాభ ! నీపదసేవ • యబ్బెనెల్ల
నాదుపుణ్యావశంబునఁ • గంటిఁగాన
నన్నుఁబ్రోవంగదయ్య యో • నళిననేత్ర!

తా. కష్టంబున నున్నవానికి నీయొక్కపాదములసేవ సంప్రాప్తంబగుట యెట్టిదన: నెండచే బడలికఁబడిన వానికి నమృతసరస్సు చిక్కినట్లును, చలిచేత మరణసన్నద్ధుఁడైనవానికి సూర్యకిరణమబ్బినట్లును, నీటిలోఁ బడికొట్టుకొనువానికిఁ దెప్పదొర

కినట్లును, నిఱుపేదకుని ధానములు గల్గునట్టులు నో
ప్పను అట్టినీసేతను నాపుణ్యవశంబునఁగాంచి తిని
గాననన్నుఁ గటాక్షింపుము.

చ. అనినుడువంగ విష్ణుఁడు మ
♦ హామదమొంది "సెబాసు ! పుత్రి! నీ
మనమునఁగల్గు వాంఛలిక
♦ మానకొసంగెదవిమ్మనీవుచ
య్యనసరుదేఽరమ్మిగను
♦ మల్లవె ! బంధునరస్సునందు మ
జ్జనమొనరించినఁదలఁచి
♦ చాలతపంబొనరింపుమవ్వధుఁ.

తా. అని బ్రహ్మవేడుకొనఁగా విష్ణుఁడు సంతసించినవాఁడై యాతనిని బంధు సరస్సునందు స్నానమాడి తపంబొనరింపుమనియు.

క. వచ్చెదనీతపమునకై
మెచ్చెదనట్టుపై నినీకు ♦ మేలెంచెదనే
నిచ్చెదనీకోరినవర
మచ్చెరువింకేల వెడలు♦మనుచుఁ బలికెన్

క. అనిచెప్పిహయగ్రీవం
బునారసింహమునుమఱియు ♦ ముదములరంగా

ఘనమగుసప్తాక్షరియు౯
మనమునబోధించిచెప్పె • మంత్రిత్రియము౯.

తా. అప్పుడు నేనువచ్చి నీవుకోరిన వరంబిచ్చెదనని, హయగ్రీవము, నారసింహము, సప్తాక్షరియునెడు మూడుమంత్రంబులు బ్రహ్మ కుపదేశించెను.

ఉ. అంతటఁబంకజాసనుఁ''డ
• హ''యనిసత్వరతాభిగమ్యుఁడై
పంతముఁబట్టినట్టులల
• బంధుసరస్సును గాంచివెంటనే
సంతసమొందమజ్జనము
• సల్ప్రియభీష్టములొందనెంచియ
త్యంతసుభక్తిమార్గమున
• నచ్చటఁజేసెఁదపంబుశ్రీర్థమై.

తా. అంతట నాబ్రహ్మ బంధుసరస్సునుగాంచి యందు స్నానంబుఁజేసి తత్తీరంబున మిగుల భక్తితోఁ దపంబుఁజేయుచుండెను.

చ॥ అటుచనెనేండ్లుఁబూండ్లుతుద
• కప్పుడునొక్కదినంబునందుఁదాఁ
బటుతరసంభ్రమంబాదవ

• బ్రహ్మను లెమ్మనియానతిచ్చియా
కుటిలుని సోమకాసురునిఁ
• గూల్చెదనంచుఁ బ్రతిజ్ఞఁ బల్కియు
చ్చోటు విడియేగెఁ దత్క్షణము
• చోద్యమె సంగము కుందుఁడంతలో

తా. అంతఁ గొంత కాలమయిన తరువాత విష్ణుఁడచ్చట సాక్షాత్కరించి బ్రహ్మకోర్కె నెరవేర్తునని చెప్పి వెడలెను.

మ. కనులన్ విప్పియజుండు నేగెను మహా
• కాంతున్ నిజాగారమున్
గనియచ్చోటను నాల్గు వేదములనెం
• తన్ గూర్మిలోఁ గాంచిన
మ్మనమందెంతయు హర్ష మొందెన హా! యు
• ప్మాకే మహాక్షేత్రమం
చునుదాచెన్ దనలోకమెల్లఁ బలువుర్
• సొంపార నాలింపఁగన్.

తా. పిదప నాబ్రహ్మ తనలోకంబున కేగి తన వేదంబుల నందుకొని సంతసించినవాఁడై యుప్మాకే గొప్పక్షేత్రమని యెల్లవారలకుఁ దెల్పెను.

చ. పదఁపడిఁ గశ్యపుండు పలు

♦ భంగులవిష్ణునింగొల్వంబోయి "యో
సదమలచిత్త ! నాకయి యెు
♦ సంగముకోరినకోర్కెనొందునీ
పదయుగ మెప్పుడుఁ మఱచు
♦ వాఁడనుగానుభవద్వ్యక్షేయుఁడన్
ముదమలరన్ గటాక్షమున
♦ బ్రోవుమునన్నిఁదెలోకరక్షకా!"

తా. తరువాతఁ గశ్యపుండుఁ గూడవిష్ణుని గురించి యనేకరీతులఁ బ్రార్థింపఁగా.

చ. అనుటయు నజ్జగద్వరదుఁ
♦ ద్విజపుంగవుఁ గాంచినీవుకో
రినవరమద్భుతంబగు స
♦ రేయిటుసేయుముబంధుసాగరం
బునజలకంబుఁసల్పికడుఁ
♦ బూనికతోడఁదపంబొనర్చిన౯
ఘనమగునీవరంబిడెద
♦గ్రక్కునఁబాపమ్మనియానతిచ్చిన౯

తా. ఓకశ్యపా ! నీవు బంధుసరస్సునందు స్నానంబు సల్పి యచ్చట నన్నర్చి తపమొనరించిన నేనచ్చట కరుఁణెంచి నీకోరిన కోర్కెనొసంగెద

నని చెప్పటము.

ఉత్సాహము.

పరమభక్తితోడనతఁడు • బంధుసాగరంబునన్
బరఁగఁదానమాడుచున్ ద • పంబుసేయుచున్నిరం
తరముమాధవున్ మనంబు • నన్ దలంచుచుండ శ్రీ
ధరుఁడువచ్చెనోక్కనాఁడు తాంబ్రిపుట్టవేగుసన్.

తా. అంతటఁ గశ్యపుండు బంధుసాగరంబున జలకమాడి విష్ణుని ధ్యానింపఁగానొక్కనాఁడాతఁడఁ చోప్పటుకరుఁణించి.

తా. ఇట్లు సాక్షాత్కరించిన నారాయణునియె దుట నక్కశ్యపుండత్యంత వినయవిధేయతతో ము కుళితాంజలుఁడై.

సీ. "దేవాదిదేవ! నీ • దివ్యప్రభావంబు
మెందుగాఁగనుట ధ • న్యుండనైతి
భక్తరక్షక! నీదు • పదధూళిసోకనే
నిండారనికపావ • నుండనైతిఁ
నార్తపోషణ! నీకృ • పార్ద్రవీక్షణజాల
వృష్టిచేలోకనో • విదుఁడనైతిఁ
గరుణాలవాల! నీ • కాంచనాంబరమీను
రుచులచేజ్ఞానతం • తుండనైతిఁ

దృశ్యుఁడగుడు వేడ్కఁ • గశ్యపుండు
చని నిజసతిఁ జూడి • సరగున నగేశవుఁ
బోలు నొక్క ముద్దు • పుత్రుఁ గనియె.

తా. అందులకు మాధవుండు సరేయని యదృశ్యుఁడగుటయుఁ గశ్యపుండు నిజస్థానంబునకరిగి తన లోకప్రకారము విష్ణుమూర్తింబోలు నొక్క కుమారుంగాంచెను.

మ. అతఁడే పిమ్మట వామనాఖ్యుఁడయి లో
• కైకప్రపూజ్యాంఘ్రుఁడై
యతిసూక్ష్మాంగుఁడు త్రివిక్రముండునయి యొ
• ప్పారెం భళీ! యిట్టి క్షే
త్రతటాకంబున నీ ధరాతరము చెం
• తఁ గల్గు భూమిప్రభా
తతులుం గన్గొని సేయఁగా నలవి నే
• ధాతాదిప్రదివౌకసాళికిన్.

తా. ఆజన్మాంతము శిశువై తర్వాత వామనమూర్తియయి యెల్లరచేఁ బూజితుండయిన మహాత్ముఁడు. కాబట్టి యిట్టి క్షేత్రమహిమను బొగడుటకు బ్రహ్మాది దేవతలకైన శక్యముగాదు.

ఉ. లోకములెల్లఁ గుక్కుటము

• లోయన రేయిఁబవళ్ళుబిగ్గను
ప్మాకమొగొప్ప క్షేత్రిమని
• మాటికిమాటికిఁగూయుచుండఁగా
మూకలుగానుఘుప్పలంగ
• ముచ్చటనొందుచు నెల్లవారలా
హా ! కనుఁగొందమంచుఁగని
• యచ్చెరువొందుచునుండిరంతలో

తా. ఉప్మాకయే మహాక్షేత్రమని లోకము లన్నియు విస్తారముగాఁ జెప్పకొనుచుండుటఁ జేత ననేకులు వచ్చి యామహిమంగని యాశ్చర్యపడు చుండఁగా.

సీ. ఖగకులేంద్రుఁడుఁగూడఁ • గనుఁగొనం
బుత్తెంచిసాగరంబునుగాంచిసంభ్రమంది
నగుక్షేత్రిమనిమెంచి• కాసంబుసేసిమాధవుఁ
గూర్చిఘోరమా • తపమొనర్చి
భావంబుసంధల్చి • పలుభంగులఁ దేవదేవుని
బ్రార్థింప • దివ్యముగను
సుముహూర్తమునమధు • సూధనుండాకస్మి
కముగనాతనికి సా • క్షాత్కరించి
గీ. ''మెచ్చినాడనీతపమున • కిచ్చెదనిక

నీవుకోరినవరము సం • దియము లేదా
టంచు బల్కినగరుడుఁడు • హర్షమొంది
యంబుజాక్షునియెదుటను • బ్రాంజలుఁడయి

తా. గరుత్మంతుఁడుగూడ నీక్షేత్రమహిమం బుఁగాంచనెంచి యీబంధుసాగరంబున స్నానమాచరించి ఘోరతపంబుసేయఁగా లక్ష్మీమనోహరుఁడాతని కట్టెదుట సాక్షాత్కరించి "నీతపంబునకుఁ జాల మెచ్చితిని నీమనోరథంబుఁ దెల్పు"మనుటయు నందులకు గరుడుండు చేతులంజోడించి

ఉ. "నిరతంబుఁ భవదీయపాదయుగళి౯
• జేపట్టియున్నాఁడన౯
గరుణ౯ పాలనుముంచిన౯ సరియె, కుం
• దర౯ నీటిలో ముంచిన౯
సరియోకోరికయొండునాకుఁగలదో
• శౌరీ! ప్రసాదింపునా
వరపక్షద్వయమందునెల్లపుడు నం
• వాసంబుగానుండుమా."

తా. సర్వేశ్వరా! యెల్లప్పుడు నీపాదంబులు నమ్మియున్నాఁడను. నీకృపాపాత్రుఁడనుగాన నెప్పుడును నీవు నాతెక్కలపై నధిష్ఠించియేయుండుటకుఁ

గాను కోరుచున్నాను.

శా. ఆ౦చున్ బల్కినఁ గాంచనాంబరుఁడుమే
  • ల౦చున్ గీరంబూచి బో
ధించెన్ "బక్షికులాగ్రగణ్య ! యిదె! నే
  • నెంతున్ సతిన్ గూడిసి
రించన్ మానుముఘోటకంబుపయిర
  • క్షిన్ వత్తునిచ్చోటు రా
జించున్ క్షేత్రముగాఁగ నెల్లరకుని
  స్సీమ" యంచుందానేగినన్.

తా. అని గరుత్మంతుఁడు పల్కఁగా విష్ణుఁడా
తనిమాటల నాలించి "పక్షికులావతంసమా!
నీవుకోరిన వరంబొసంగితిని. నేనిప్పుడుపోయి వెం
టనే లక్ష్మితోఁగూడ గుఱ్ఱముపై నెక్కి యిచ్చట
కు వచ్చెదను. ఈస్థలము దివ్యక్షేత్రంబగు" నని
నుడిచనియె.

గీ. కృతయుగమునబంగరుకొండ • క్రియగరుడుఁడు
దన రెరజితాద్రిమాడ్కిఁ • త్రేతాయుగమునఁ
దామ్రమయమయినట్టులు • ద్వాపరమునఁ
గలియుగమునఁ బాషాణంబు • కరణిమిగుల

తా. అట్లచ్చట గరుత్మంతుఁడు దేవుని రాక

కయి కృతయుగంబున బంగారుకొండరూపంబునను త్రేతాయుగంబున వెండికొండ యాకారమునను ద్వాపరంబున తామ్రపర్వతముమాడ్కిని గలియుగంబునఁ బాషాణంబు విధంబున నచ్చోటనుఁగాచుకొనియుండె.

చ. పిదపము దాఁ వేడ్కమెయిఁ
 • ప్రియసిరిసతితోడఁ గూడి స
మ్ముదమున వేటమార్గమునఁ బో
 • వుచు శ్వేతహయంబునెక్కి సాం
పాదవఁగఁ గొండరూపము న
 • నుండిన యాఖగనాథుమీఁదఁ దా
సదయమనంబునన్ నిలిచి
 • సన్నుతిసేయఁగ నెల్ల దేవతల్

తే. గీ. అచలమ్ముగరూపమున నున్న • యట్టిరొల్ల
మునివరేణ్యులకప్పుడు • మోదమిచ్చి
శేలుమేలని గరుడుని • మెచ్చుకొనుచు
క్షేత్రమధ్యంబునకుదయ • సేసె నెలమి.

తా. తరువాత విష్ణుఁడొకనాఁడు వేటమార్గంబున లక్ష్మీసమేతుఁడయి శ్వేతాశ్వమునెక్కి వచ్చుచు నచ్చోఁగొండరూపంబు ధరించిన గరుత్మం

తునిపై నధిష్ఠించి యచ్చోటఁ దపంబులు సల్పు చుండిన మునివరుల కెల్లరకు మోక్షంబొసఁగియా క్షేత్రమధ్యభాగంబునకు వేంచేసెను.

తదనంతరమున—

ఉ. నారదమౌనిచంద్రుఁడు ఘ
♦ నంబగుక్షేత్రములెల్లఁగాంచి సం
చారముఁ జేసియొక్కెడివ
♦ సంబునబంధుపదస్సుఁ జూడఁగాఁ
గోరికఁ గల్గివచ్చియట
♦ కుర్గనులారఁగఁ గన్గొంచితాఁ
మీఱినభక్తితోఁగనిని
♦ మీలితలోచనుఁడౌచునాత్మలో

తా. పిమ్మట నొకనాఁడా నారదుఁడు సకలది వ్యక్షేత్రంబులు సేవించి తన్మార్గంబున నీబంధుపర స్సుంగాంచఁ గుతూహలుండయి ప్రవర్తించి యిం దుంగల యెల్లవింతలనరసి సర్వేశ్వరుంగూర్చియు నక్షేత్రమహాత్వంబుఁగూర్చియు నాత్మలో

సీ. పంకజాసనుఁడుముఖ్ ♦ బలిమభక్తి నిష్ఠఁ
గూర్చితపముఁ జేసి ♦ కోరిక నోటు
దేవతారాధ్యుఁడౌ ♦ దివ్యప్రభావుండుగని

పుండుపరంబు • గనినచోటు
ఖగకులేంద్రుఁడునగా • కారంబుదాల్చి
శ్రీపతిఁజైనిలిడుకొని • పరఁగుచోటు
మునివరుల్ పలుతపం • బులనల్పసంకల్ప
సిద్ధులై మోక్షంబుఁ • గెందుచోటు
గీ. ననుప మానది వ్యప్రిభా • వాతిశయము-
తోడసంతతంబునుదులఁ • దూగుచోటు
నిట్టియుప్మాకసుక్షేత్ర • మించుకైన
నలవియగునె వర్ణింప • నెలువకైన

తా. బ్రహ్మ విష్ణునిఁగూర్చి భక్తితోఁదపముఁ జేసినచోటును, దేవతలచేతఁ బూజింపఁబడునట్టి కశ్యపుఁడు విష్ణునిచే వరంబుఁ బొందినస్థలమును, గరుత్మంతుఁడు గొండరూపంబుఁదాల్చి మాధవుని తనమీఁదనుంచు కొన్నతావును, ననేకఋషులు ఘోరతపంబులాచరించి మోక్షముంగనిన నీవు యు సాటిలేనటువంటి మహాత్త్వంబుఁగల ప్రదేశం బునునగు నట్టి యుప్మాక మహాక్షేత్రముయొక్క యామాహాత్మ్యంబు నెంచుటకు బ్రహ్మదేవునికైనను శక్యముకానేరదు.

మ. అనుచుఁ మెచ్చుచున మ్మునీంద్రుఁడటస్నా

నాథుల్ సడిఁ బల్కి, విష్ణుని సేవింపసుగంబు నెక్కి
కరముల్ ♦ జోడించి సద్భక్తిఁ గీర్తనలం బాడుచుని
ష్ఠనొక్క సుముహూ ♦ ర్తంబంధ సదోచ్చ బ్రతిష్ఠను జే
సెన్ సిరితో ♦ వాహనముతో ♦ డన్ వెల్గునద్దేవునిన్.

తా. అట్టులా కేశవుని బ్రహ్మ సన్నుతించుచు నొకసు
ముహూర్తంబున విష్ణుని, లక్ష్మీసహాయ సహితం
బుగాఁ బ్రతిష్ఠ యొనరించెను.

ఉ॥ చాలదినంబులైనతరి ♦ స్వామియొకానొక
నాఁడుకొండపై నాలనుగాచువానికల ♦ యందునఁ
గన్పడి తట్టిలేపి "గో। పాలక ! వేటమార్గమున ♦
వచ్చితిమిచ్చటికేము లచ్చియున్। మేలగునీకు" నంచు
ను జ ♦ నెన్ మను నాఁడు గొల్లఁడెంతయున్॥

తా॥ కొన్ని దినంబులయిన పిదప నొకదినమున
నారాయణుండొక గొల్లవాని స్వప్నంబునకరుదెం
చి వేటమార్గమున లక్ష్మితోఁ గూడ దానచ్చటకు
విచ్చేసితినని చెప్పఁగా నాగోపాలుఁడు తత్క్షణంబున

ఉ. అబ్బురమంది చిత్తమున ♦ యానగమంత
యుఁ గాంచి యొక్కచో। గొబ్బునఁ జూచి యాహ
రుని ♦ కుంఠిత తేజు, యశోవిహారు నొ[illegible] । యు
టంమ వెంట నెజ్ ♦ హాసనంబిగ్గ[illegible]

